## II. తహారత్ (పరిశుభ్రత)

ఇస్లామ్‌లో అల్లాహ్ మరియు అల్లాహ్ సందేశహరులు హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం గారి పై సంపూర్ణ విశ్వాసాన్ని ప్రకటించి ఏక దైవారాధన మరియు దైవదౌత్యాన్ని తెలిపే సద్వచనం (కలిమయె తయ్యిబ) చదివిన తరువాత, మొట్టమొదటిది మరియు విధి(ఫర్జ్) గా పాటించ వలిసిన ఆజ్ఞ – "నమాజ్". నమాజ్ ను ఆచరించుటకు తహారత్ (పరిశుభ్రత) అనేది తప్పనిసరి. తహారత్ (పరిశుభ్రత) లేకుండ నమాజ్ ఆచరించడానికి వీలు లేదు. **"మిఫ్తాహుల్ జన్నతి అస్సలాతు, వ మిఫ్తాహుస్సలాతి అత్తుహూర్"** – అనగా స్వర్గలోకపు తాళపు చెవి నమాజ్, నమాజ్ తాళపు చెవి పరిశుద్ధత. కావున తహారత్ (పరిశుభ్రత) కు సంబంధించిన ఆదేశాలను గూర్చి ముందుగా తెలుసు కుందాం.

తహారత్ (పరిశుభ్రత) అనగా శుచి, శుభ్రత. అశుద్ధత నుండి పరిశుద్ధతను పొందుట అని అర్థం. ఇస్లాం ధర్మశాస్త్రానుసారం 1. నజాసతె హఖీఖీ అనగా యదార్థ అశుద్ధత. 2. నజాసతె హుక్మీ అనగా ఆదేశంచే పరిగణింపబడే అశుద్ధత, అనే రెండు విధాలైన అశుద్ధతలను దూరం చేసి పరిశద్ధతను పొందడాన్ని తహారత్ (పరిశుభ్రత) అంటారు. శరీరాన్ని పరిశుభ్రంగా ఉంచడం, ఆత్మను పరిశుభ్రంగా ఉంచడం, మనస్సును కుళ్ళు, కుతంత్రాల, ఈర్ష్యా ద్వేషాల నుండి పరిశుభ్రంగా ఉంచడం కూడా ఇందులోని ఉద్దేశ్యము.

అల్లాహు తఆలా పరమ పవిత్రుడు, పరిశుద్ధుడు. పరిశుద్ధతను అమితంగా ప్రేమిస్తాడు. హదీసులలో 'తహారత్' అర్ధ విశ్వాసమని పేర్కొన బడినది. దీనిని బట్టి ఇస్లామ్‌లో 'తహరత్' కు ఎంత ప్రాధాన్యత యున్నదో గ్రహించ వచ్చును.

ఇందు వల్ల ప్రతి ముస్లిమ్ 'తహారత్' ఆదేశాల తెలిసికొనుట తప్పనిసరియై యున్నది. అందుచే ఇచ్చట తహారత్ కు సంబంధించిన ముఖ్యమైన విషయాలను ముందుగా తెలుసుకుందాం.

### 01. నజాసత్ (అశుద్ధత)

ఇస్లామ్ లో తహారత్ (పరిశుభ్రత) తప్పనిసరియై ఉన్నది. పరిశుభ్రతకు

అత్యంత ప్రాముఖ్యత ఇవ్వబడినది. దీని వాస్తవికతను, ఆదేశాలను, నియమ నిబంధనలను తెలుసుకోవటానికి ముందు నజాసత్ (అశుద్ధత) వివరాలను, వాటి ఆదేశాలను తెలుసుకోవడం చాలా ముఖ్యం.

నజాసత్ అంటే అశుద్ధత, అపరిశుభ్రత అని అర్థం. ఈ నజాసత్ రెండు రకాలు. **01.** నజాసతె హఖీఖీ అంటే యదార్థ అశుద్ధత, **02.** నజాసతె హుక్మీ అంటే ఆదేశం వల్ల పరిగణింపబడే అశుద్ధత.

## 1.1. నజాసతె హఖీఖీ (యదార్థ అశుద్ధత)

కంటికి కనబడే యదార్థ అశుద్ధతను నజాసతె హఖీఖీ అంటారు. సహజంగానే మనిషి దీనిని అసహ్యించు కుంటాడు. మనిషి ఇలాంటి అపరిశుభ్రత నుండి తన శరీరాన్ని, దుస్తుల్ని, ఆహార పానీయాలను, తన వస్తువులను కాపాడుకుంటాడు. ఈ అశుద్ధత రెండు రకాలు. **1.** నజాసతె గలీజ (పెద్ద (ఘాటైన) అశుద్ధత), **2.** నజాసతె ఖఫీఫ (స్వల్ప (తేలికపాటి) అశుద్ధత)

**1. నజాసతె గలీజ (పెద్ద (ఘాటైన) అశుద్ధత):** అపరిశుభ్రత అని అనడంలో ఎటువంటి సందేహం లేని ఘాటైన అశుద్ధతను 'నజాసతె గలీజ' అంటారు. మనిషి ఎప్పుడూ దీనికి దూరంగా ఉంటాడు. ఉదా: మానవులు మరియు హరాం (నిషేధిత) జంతువుల మల మూత్రాలు, హలాల్ జంతువుల మలము, వీర్యము, వీర్యమునకు ముందు స్ఖలించే మజీ, వదీ, కారుతున్న రక్తం, చీము, స్త్రీల బహిష్టు నెత్తురు, కాన్పు తరువాత జరిగే రక్తస్రావము, జబహ్ కాకుండానే మరణించిన జంతువుల మాంసం, చర్మం, మద్యం (సారాయి), కోడి బాతుల రెట్టలు మొదలగునవి.

**2. నజాసతె ఖఫీఫ (స్వల్ప (తేలికపాటి) అశుద్ధత):** స్వల్ప (తేలికపాటి) అశుద్ధ పదార్థాలను 'నజాసతె ఖఫీఫ' అంటారు. ఉదా: మేక, గేదె, ఆవు, ఎద్దు మొదలైన హలాల్ పశువుల మూత్రం, హరాం పక్షులైన కాకి, గ్రద్ద మొదలగు పక్షుల రెట్ట మొదలగునవి.

### 1.1.1. క్షమార్హమైన నజాసతె హఖీఖీ (యదార్థ అశుద్ధత)

**1. నజాసతె గలీజ నియమములు: నజాసతె గలీజ** (ఘాటైన అశుద్ధత) **ఘనరూపములో యుంటే** (మలం, పెంట, పేడ మొదలగునవి) (గ్రా. 4.374

(నాలుగు మాషాలు) గానీ లేక అంతకంటే తక్కువ గానీ మన శరీరానికో, వస్త్రములకో అంటుకుంటే, అది క్షమార్హం (క్షమింపబడుతుంది). **నజాసతె గలీజ ద్రవరూపములో యుంటే** (పలుచనిదైతే) (రక్తం, మూత్రం, మద్యం మొదలగునవి) రూపాయి నాణెమంత గానీ లేక అంతకంటే తక్కువ గానీ మన శరీరానికో, వస్త్రములకో అంటుకుంటే, అది క్షమార్హం (క్షమింపబడుతుంది).

**2. నజాసతె ఖఫీఫ నియమములు: నజాసతె ఖఫీఫ** (స్వల్ప (తేలికపాటి) అశుద్ధత) వస్త్రం లోని ఏదో ఒక భాగంలో గానీ, శరీరంలోని ఏదో ఒక అవయవమునకు గానీ నాల్గవ వంతు (1/4) కన్నా తక్కువ భాగానికి అంటినట్లయితే అది క్షమార్హం. (క్షమింపబడుతుంది).

**గమనిక:** 'క్షమార్హం' (క్షమింపబడుతుంది) అంటే ఈ పరిమాణంలో అశుద్ధత శరీరానికో, వస్త్రానికో అంటి యున్నప్పుడు, నమాజ్ ఆచరించినచో, అది నెరవేరుతుందని అర్థం. అశుద్ధత యున్నదని తెలిసి కూడ శుభ్రం చేసుకోకుండా వదిలి వేయడం తగదు. అశుద్ధత యున్నదని తెలిసి కూడ, శుభ్రము చేసుకోకుండా నమాజ్ ఆచరించిన, అది మక్రూహ్ అవుతుంది. (దీనియాత్, 2 యమ్, స. 63)

## 1.1.2. నజాసతె హఖీఖీ నుండి పరిశుద్ధతను పొందు పద్ధతి

అశుద్ధత శరీరంపై యుంటే దానిని నీటితో శుభ్రంగా కడిగివేయాలి. దుస్తులపై యుంటే ఆదుస్తులను మూడు సార్లు శుభ్రంగా కడిగివేయాలి. కడిగిన ప్రతిసారీ దుస్తులను బాగుగా పిండాలి. పిండుటకు వీలుకాని చాప, తివాచీ, కంబళి, బొంత మొదలగు వాటిని కడిగిన తరువాత నీరంతా కారిపోయేంత వరకు వ్రేలాడదీసి ఉంచాలి. ఇట్లు మూడు సార్లు కడిగి వ్రేలాడదీసినచో ఆవస్తువు పరిశుభ్రమౌతుంది. (దీనియాత్ 2 యం, స. 63)

పిండుటకు వీలుకాని చాప, తివాచీ, కంబళి, బొంత మొదలగు వాటిని శుభ్రంచేసే తేలికైన విధానమేమనగా, వాటిని నేలపై పరచి కడుగుతూ, నీరు అధికంగా ప్రవహింప చేయాలి. ఇట్లు చేసిన వాటిని, పిండ వలసిన అవసరం లేదు. వ్రేలాడదీయ వలసిన అవసరమూ లేదు.

అపరిశుభ్రతను పీల్చని వస్తువులు ఉదా: కత్తి, అద్దం, సీసా మొదలగు వానిపై ఉన్న అశుద్ధతను శుభ్రంగా తుడిచి వేసినచో అవి శుభ్రమై పోతాయి.

చర్మపు వస్తువులు(బూట్లు మొదలగునవి), వెండి, రాగి, అల్యూమినియం, ఇత్తడి, ఇనుము వంటి లోహపు వస్తువులు, గాజు మరియు పింగాణి (గాజుసామానులు) ఇవి గరుకుగా లేకుండ నున్నగా వుంటే వాటికి అశుద్ధత లేకుండా శుద్ధిగా తోమినచో శుభ్రమౌతాయి.

నేల విషయములో అపరిశుభ్రత యొక్క తడి ఆరిన తరువాత ఆ అపరిశుభ్రత యొక్క ఛాయలు, దుర్వాసన పోయిన తర్వాత, అ నేలను పరిశుభ్రమైనదిగా పరిగణింప బడును.

## 1.2. నజాసతె హుక్మీ (ఆదేశము వలన పరిగణింపబడే అశుద్ధత)

మన కంటికి కనబడకుండా ఇస్లామ్ ధర్మశాస్త్రము మాత్రమే తెలిపే అశుద్ధతను నజాసతె హుక్మీ (ఆదేశము వల్ల పరిగణింపబడే (బయటికి కనబడని) అశుద్ధత) అంటారు. ఇది షరీఅత్ (ధర్మశాస్త్రం) విధించిన నజాసత్ (అశుద్ధత) కాబట్టి, దీనిని 'నజాసతె షరయీ', అని కూడా అంటారు. దీనిని 'హదస్' అని కూడా అంటారు. ఇది రెండు రకాలు. **1.** హదసె అస్గర్ (చిన్న అశుద్ధత), **2.** హదసె అక్బర్ (పెద్ద అశుద్ధత)

### 1.2.1. హదసె అస్గర్ (చిన్న అశుద్ధత)

అశుద్ధతకు చెందిన తేలికపాటి స్థితిని హదసె అస్గర్ (చిన్న అశుద్ధత) అంటారు. శరీరం నుండి ఏదైనా విసర్జించిన, అనగా మలమూత్రాలు విసర్జించడం, అపానవాయువు వెలువడటం(పిత్తు), రక్తం గాని, చీము గాని కారడం, నోటి నిండా వాంతి కావడం మొదలగు వాటి ద్వారా ఈ స్థితి ఏర్పడును. దీని మూలంగా వుజూకు భంగం వాటిల్లుతుంది. వుజూ చేయుటచే, హదసె అస్గర్ (చిన్న అశుద్ధత) నుండి పరిశుద్ధత కలుగును. నీరు లభించనిచో తయమ్ముమ్ చేయుటచే హదసె అస్గర్ (చిన్న అశుద్ధత) నుంచి శుద్ధి పొంద వచ్చును.

### 1.2.2. హదసె అక్బర్ (పెద్ద అశుద్ధత)

హదసె అస్గర్‌తో పోలిస్తే హదసె అక్బర్ చాలా పెద్ద దైన అశుద్ధత. ఇది భార్యా భర్తల సంభోగం (జనాబత్), వీర్య స్ఖలనం (ఇహ్‌తిలామ్), ఋతు రక్తం (ముట్టు,హైజ్) మరియు బాలింతకు రక్తస్రావం (నిఫాస్) ఇత్యాదుల

మూలంగా ఏర్పడుతుంది. గుస్ల్ చేయడం మూలంగా హదసె అక్బర్ నుండి పరిశుద్ధత కలుగుతుంది. నీరు లభించనిచో తయమ్ముమ్ చేయుటచే హదసె అక్బర్ (పెద్ద అశుద్ధత) నుంచి శుద్ధి పొంద వచ్చును.

### గమనిక

**01.** భార్యా భర్తల సంభోగంలో వీర్య స్ఖలనం కాకపోయినా గుస్ల్ చేయడం తప్పనిసరి. కానీ ఏదైనా వ్యాధి కారణంగా సంభోగ సుఖానుభూతి లేకుండా మూత్రం ద్వారా వీర్యస్ఖలనం కలిగితే ఏర్పడిన అశుద్ధత వుజూ చేయడం ద్వారా దూరమౌతుంది. (ముకమ్మల్ నమాజ్, స.9)

**02.** హైజ్ (రుతుస్రావం) మరియు నిఫాస్ (కాన్పు సమయంలో కలిగే రక్త స్రావం) వల్ల ఏర్పడిన అశుద్ధత గుస్ల్ చేయడం వలన దూరమౌతుంది. కానీ ఏదైనా వ్యాధి వలన రక్తస్రావం కలిగినచో, దానివల్ల ఏర్పడిన అశుద్ధత వుజూ చేయడం ద్వారా దూరమౌతుంది. (ముకమ్మల్ నమాజ్, స.9)

**03.** మనము 'గుసుల్' అని పలుకుటకు అలవాటు పడియున్నాము. కానీ దాని సరియైన ఉచ్చారణ "గుస్ల్". కావున దీనిని అలవాటు చేసుకుంటారనే దృష్టితో నేను "గుస్ల్" అనే వాడడము జరిగినది.

## 02. హైజ్, నిఫాస్, ఇస్తిహాజాల ఆదేశాలు

### 2.1. హైజ్ (ఋతురక్తస్రావము)

బహిష్టు సమయంలో స్త్రీ మర్మాంగం నుండి ప్రతి నెల వెలువడే రక్తంను 'హైజ్' అంటారు. హైజ్ యొక్క అశుద్ధత నుండి పరిశుభ్రత పొందుటకు గుస్ల్ తప్పని సరిగా చేయాలి.

**01.** దీని కనీస సమయము 3 రోజులు, అత్యధిక సమయము 10 రోజులు. ఇంతకంటే కొంచెము తక్కువయినా లేక ఎక్కువయినా అది హైజ్ కాదు. దానిని ఇస్తిహాజా (రోగము) అందురు. (ఇల్ముల్ ఫిఖహ్,112, మసాఇలె గుస్ల్/29)

**02.** హైజ్‌లో రక్తము ఎడతెరిపి లేకుండా రావలసిన అవసరము లేదు. ముందు ప్రారంభములో కొంచెం సేపు రక్తం వచ్చి, తరువాత ఆగిపోయి, తిరిగి రెండవ, మూడవ రోజున వచ్చిన, అప్పుడు కూడ షరీఅత్ ప్రకారము హైజ్ గానే పరిగణింప బడుతుంది.

**03.** రెండు హైజ్‌ల మధ్య పరిశుభ్రముగా ఉండే సమయము షరీఅత్ ప్రకారము కనీసము 15 రోజులు. అధిక రోజుల హద్దు ఏమియు లేదు. ఎన్ని నెలలు అయినను రక్తము స్రవించకుండా యున్న, అన్ని రోజులు పరిశుభ్రముగా ఉన్నట్లుగానే భావించాలి.

**04.** ఎవరికైనా ప్రతి నెల 3 లేక 4 రోజులు రక్తము స్రవించే అలవాటు యుండి, ఒక నెల అంతకన్నా ఎక్కువ రోజులు రక్తస్రావము జరిగినచో, అది పది రోజుల కన్నా తక్కువగా యున్నచో, అది అంతయు హైజ్‌గా పరిగణింప బడుతుంది. రక్తస్రావము 10 రోజుల కన్నా ఎక్కువైనచో, అలవాటు ప్రకారము ఎన్ని రోజులైతే యుండేదో, అన్ని రోజులు హైజ్ గాను, మిగిలిన రోజులు ఇస్తిహాజా (రోగము) గాను భావించాలి.

**05.** ఎవరికైనా అలవాటు మారుచుండిన, (ఉదా: ఒక నెల 3 రోజులు, ఇంకొక నెల 4 రోజులు, మరొక నెల 6 రోజులు) అది 10 రోజుల లోపు ఉండినచో, హైజ్‌గా పరిగణింప బడుతుంది. 10 రోజుల కన్నా ఎక్కువగా యున్నచో, ఇంతకు ముందు అలవాటుగా రక్తస్రావమయ్యే రోజులు హైజ్ గాను, మిగిలిన రోజులు ఇస్తెహాజ (రోగము) గాను పరిగణించాలి.

**06.** ఏ బాలికకైనా మొదటి సారి ఋతుస్రావము జరిగి, ఆగక చాలా కాలము కొనసాగితే, రక్తస్రావమయిన రోజు నుండి 10 రోజులు హైజ్ గాను, మిగిలిన రోజులు ఇస్తెహాజా (రోగము) గాను పరిగణించాలి. (బిహిష్తి జేవర్, 2/59)

### గమనిక

**01.** ఒక రోజు అనగా ఒక పగలు ఒక రాత్రి అని గమనించ గలరు.

**02.** తెల్లబట్ట (ల్యుకోరియా) అయితే గుస్ల్ చేయవలసిన అవసరం లేదు. కానీ ఇలాంటి స్త్రీలు ప్రతి నమాజ్ కొరకు క్రొత్తగా వుజూ చేసి నమాజ్ ఆచరించాలి. వుజూ చేయడానికి ముందు రహస్యాంగాన్ని నీటితో శుభ్రపరచుకోవాలి.

## 2.2. నిఫాస్ (పురుటి రక్తస్రావము)

కాన్పు తరువాత స్త్రీ మర్మాంగం నుండి స్రవించే రక్తమును 'నిఫాస్' అంటారు. ఈ అశుద్ధత నుండి పరిశుభ్రతను పొందుటకు గుస్ల్ తప్పని సరిగా చేయాలి. నిఫాస్ రక్తము ఆగిన వెంటనే గుస్ల్ చేసి నమాజ్ ఆచరించాలి.

కొంతమంది నిఫాస్ రక్తము ఆగిపోయినను 40 రోజుల వరకు గుస్ల్ చేయరు. మధ్యలో గుస్ల్ చేసినను నమాజ్ ఆచరించరు. ఇట్లు చేయుట చాలా తప్పు. పాపము కలుగును.

**01.** నిఫాస్ కాలపరిమితి గరిష్ఠంగా 40 రోజులు. కనిష్ఠ పరిమితి నిర్దేశింప బడలేదు. కాన్పు తరువాత కొద్ది సేపు రక్తము వచ్చి ఆగిపోయినా, దానిని నిఫాస్ గానే పరిగణించాలి. నలభై రోజులకు ముందే రక్తస్రావం ఆగిపోతే, ఆగిపోయిన వెంటనే గుస్ల్ చేసి నమాజ్ ఆచరించుట ప్రారంభించాలి. 40 రోజుల కంటే ఎక్కువ కాలం రక్తస్రావం జరిగితే, గడువు (40 రోజులు) ముగియగానే గుస్ల్ చేసి నమాజ్ ప్రారంభించాలి. (ఇల్ముల్ ఫిఖహ్,112, మసాఇలె గుస్ల్, స.29)

**02.** కాన్పు తరువాత రక్తము అసలే రాకపోయినను, గుస్ల్ చేయుట తప్పనిసరి అయి యున్నందును గుస్ల్ చేసి నమాజ్ ఆచరించాలి.

**03.** ఒకటి అర శరీర భాగాల నిర్మాణము జరిగిన తరువాత గర్భస్రావము జరిగి వచ్చిన రక్తమును కుడ నిఫాస్‌గా భావించాలి. శిశువు అంగ నిర్మాణము జరుగకుండా కేవలము మాంసపు ముద్దలాగా గర్భస్రావము అయి రక్తము వచ్చినచో, అది నిఫాస్ కాదని గ్రహించాలి.

**04.** మొదటి (తొలి) కాన్పులో 40 రోజుల తరువాత కూడ రక్తస్రావము జరిగినచో, 40 రోజుల వరకు నిఫాస్ గాను, మిగిలిన రోజులు ఇస్తిహాజా (రోగ లక్షణము) గాను భావించాలి. 40 రోజుల తరువాత వెంటనే గుస్ల్ ఆచరించి, నమాజ్ ప్రారంభించాలి. రక్తము ఆగేవరకు నిరీక్షించ వలసిన పని లేదు.

**05.** మొదటి (తొలి) కాన్పు కాకుండ తరువాతి కాన్పులలో, 40 రోజుల తరువాత కూడ రక్తస్రావము జరిగినచో, మొదటి (తొలి) కాన్పులో రక్తస్రావము జరిగినన్ని రోజులు (40 రోజుల లోపు మాత్రమే) నిఫాస్ గాను, మిగిలిన రోజులు ఇస్తిహాజా (రోగలక్షణము) గాను భావించాలి. నిఫాస్ తరువాత వెంటనే గుస్ల్ ఆచరించి, నమాజ్ ప్రారంభించాలి. రక్తము ఆగేవరకు నిరీక్షించ వలసిన పని లేదు.

**06.** నిఫాస్ రక్తము ఆగిన వెంటనే గుస్ల్ చేసిన ఆరోగ్యము చెడుపోతుందని వైద్యులు చెప్పినను, లేక స్వానుభవము యున్నను, గుస్ల్‌కు బదులుగా తయమ్ముమ్ చేసైనా సరే నమాజ్ ఆచరించుట ప్రారంభించాలి. (బిహిష్తి జేవర్, 2/61)

## 2.3. హైజ్, నిఫాస్‌లకు సంబంధించి కొన్ని ముఖ్య ఆదేశాలు

**01.** హైజ్, నిఫాస్‌ల స్థితిలో నమాజ్ చేయడం, రోజా పాటించడం, ఖుర్ఆన్ పఠించడం మొదలగునవి నిషిద్ధమై యున్నవి. హైజ్, నిఫాస్‌ల కాలం ముగిసిన వెంటనే గుస్ల్ చేసి నమాజ్ ఆచరించాలి.

**02.** హైజ్, నిఫాస్‌ల కాలంలో తప్పిపోయిన నమాజ్‌లు పూర్తిగా క్షమించ బడును. అనగా శారీరక శుభ్రత పొందిన తరువాత కూడ వాటి ఖజా ఆచరించ వలసిన పని లేదు. కానీ ఉపవాసాలు మాత్రం క్షమించ బడవు. శారీరక శుభ్రత పొందిన తరువాత వాటి ఖజా ఆచరించ వలసి ఉంటుంది.

**03.** నమాజ్ వేళ పూర్తిగా దగ్గర పడిన సమయంలో బహిష్టు, నిఫాస్‌ల రక్తస్రావం ఆగిపోతే, వెంటనే గుస్ల్ చేసి నమాజ్ చేయాలి. లేనిచో ఖజా చేయవలసి యుంటుంది.

**04.** హైజ్ మరియు నిఫాస్‌ల స్థితిలో స్త్రీలతో పురుషులు కలిసి కూర్చో వచ్చును, తిన వచ్చును, త్రాగ వచ్చును, నిద్రించ వచ్చును, కౌగిలించుకో వచ్చును, ముద్దు పెట్టుకో వచ్చును. ఇవి ఏవియు నిషిద్ధము కాదు.

**05.** హైజ్ మరియు నిఫాస్‌ల స్థితిలో స్త్రీలతో సంభోగించ కూడదు. అది నిషిద్ధము, మహాపాప కార్యము.

**06.** హైజ్ మరియు నిఫాస్‌ల రక్తస్రావము ఆగిన తరువాత గుస్ల్ చేసి ఒక నమాజ్ సమయము గడచిపోయిన తరువాత సంభోగము చేయుటకు అనుమతి గలదు.

**07.** మామూలుగా అలవాటైన సమయము కన్నా ముందుగా రక్తస్రావము ఆగిపోయినచో, వెంటనే గుస్ల్ చేసి నమాజ్ ఆచరించుట వాజిబ్ అయి యున్నది. కాని సంభోగము చేయుటకు అనుమతి లేదు. హైజ్ మరియు నిఫాస్ యొక్క రక్తస్రావము రోజులు పూర్తిగా గడచిన తరువాత మాత్రమే సంభోగము చేయుటకు అనుమతి గలదు.

**08.** హైజ్ మరియు నిఫాస్ స్థితిలో స్త్రీ యొక్క శరీరము, చెమట, వస్త్రాలు, పడక అపవిత్రముగా పరిగణింపరాదు. వాటిపై అశుభ్రత అంటిన, అవి అపవిత్రమౌతాయి. లేని యెడల అపవిత్రము కావు.

**09.** హైజ్ మరియు నిఫాస్ స్థితిలో మసీదు లోనికి వెళ్ళుట, కాబా గృహము యొక్క తవాఫ్ చేయుట, పవిత్రమైన ఖుర్ఆన్ తాకుట, పవిత్రమైన ఖుర్ఆన్ చదువుట చేయరాదు. కానీ ఖుర్ఆన్‌ను పెట్టెలో యుంచిన గానీ లేదా ఏదైనా గుడ్డలోచుట్టి యుంచిన గాని వాటిని తాక వచ్చును.

**10.** హైజ్ మరియు నిఫాస్ స్థితిలో పవిత్రమైన ఖుర్ఆన్‌ను చదువరాదు. కానీ పవిత్రమైన ఖుర్ఆన్ లోని ఒక వాక్యము కంటె తక్కువ, లేక ఒక వాక్యములో కొద్ది భాగము నోటితో పలుకుటకు, చదువుటకు కొందరు మతగురువుల వద్ద అనుమతి గలదు.

**11.** పిల్లలకు పవిత్రమైన ఖుర్ఆన్ చదివిస్తున్న స్త్రీ, ఖుర్ఆన్ హిజ్జే (స్పెల్లింగ్) చేయించ వచ్చును. 'రవా' చదివించ వలసి వస్తే మాత్రము పూర్తి వాక్యము చదువరాదు.

**12.** భోజనానికి ముందు 'బిస్మిలాహిర్రహ్మానిర్రహీం', భోజనానికి చివర 'అల్‌హందు లిల్లాహ్' అనుటలో తప్పులేదు. ఎందుకన, ఇక్కడ ఖుర్ఆన్ పఠన ఉద్దేశ్యము కాదు.

**13.** హైజ్ మరియు నిఫాస్‌ల స్థితిలో అల్లాహ్ నామ స్మరణ (జిక్ర్, తస్బీహ్), ఇస్తిగ్‌ఫార్, మస్‌నూన్ దుఆలు చేయవచ్చును. ఖుర్ఆన్ లోని దుఆలను కూడ చేయ వచ్చును. దరూదె షరీఫ్ పఠించ వచ్చును.

**14.** హైజ్ మరియు నిఫాస్‌ల స్థితిలో కూడ నమాజ్ సమయములో వుజూ చేసి, శుభ్రమైన స్థలములో కూర్చొని జిక్ర్, ఇస్తిగ్‌ఫార్ మొదలగునవి చేస్తూ యుండాలి. ఇట్లు చేయుటచే నమాజ్ అలవాటు తప్పిపోకుండా యుంటుంది. ఇది ముస్తహబ్ కూడ. (బిహిష్తి జేవర్, 2/61)

## హెచ్చరిక

**01.** హైజ్ మరియు నిఫాస్‌ల స్థితిలో సజ్దా చేయ వలసిన ఆయత్ విన్నను, సజ్దయె తిలావత్ చేయనవసరము లేదు. (బిహిష్తి జేవర్, 2/61)

**02.** అనేక చోట్ల చాలా మంది స్త్రీలు నిఫాస్ రక్త స్రావము ఆగిపోయినను, 40 రోజులు అపవిత్రముగానే భావించి, నమాజ్ ఆచరించరు. ఇది చాలా పొరబాటు. ఇట్లు చేయుట హరాం. (నిషిద్ధము) రక్తస్రావము ఆగనిన

తరువాత, ఇక రక్తస్రావము జరుగదని తెలిసిన తరువాత, గుస్ల్ (స్నానము) చేసి నమాజ్ ప్రారంభించాలి.

**03.** పురుటి స్త్రీలు మూడు సార్లు గుస్ల్ (స్నానము) చేయాలని భావించుట, కాన్పు అనంతరము 6 లేక 10 రోజుల గుస్ల్ (స్నానము), 20 రోజుల గుస్ల్ (స్నానము), 40 రోజుల గుస్ల్ (స్నానము) తప్పనిసరి అని భావించడము – ఇవి అన్నియు తప్పుడు ఆచారలు. ఇతర మతస్థులను చూసి మనము కూడ చేయుట పొరబాటు. ఇవి చేయరాదు. వీటిని విడిచి పెటవలెను. (బిహిష్తి జేవర్)

## 2.4. ఇస్తిహాజా (రక్తస్రావము)

బహిష్టు స్త్రీలలో 3 రోజుల కన్నా తక్కువ 10 రోజుల కన్నా ఎక్కువ కాలం స్రవించే రక్తంను, గర్భిణీ కాలంలో స్రవించే రక్తంను, పురిటి స్త్రీలలో 40 రోజుల తరువాత స్రవించే రక్తంను 'ఇస్తిహాజా రక్తం' అంటారు. అనగా ముక్కు, నోరు, పళ్ళ నుండి స్రవించే రక్తం లాంటిది. ఇది వ్యాధి వల్ల స్రవిస్తుంది. దీనిని ఇస్తిహాజా అంటారు.

ఇస్తిహాజా స్థితిలో నమాజ్ మాఫీ లేదు. అన్ని రకాల ప్రార్థనలు చేసుకో వచ్చును. గుస్ల్ చేయవలసిన అవసరం లేదు. ఖుర్ఆన్ పఠనము, నమాజ్‌లు ఆచరించుట, ఉపవాస ముండుట మొదలగు ఆరాధనల నన్నింటిని ఆచరించ వచ్చును. వాటిని మానివేయరాదు. ఆరాధనలను ఆచరించుటలో ఇస్తిహాజాలో ఉన్నవారికి, ఇతరులకు ఎటువంటి భేదము లేదు. కానీ ఫర్జ్ నమాజ్ సమయమైన ప్రతీసారీ కొత్తగా వుజూ చేయవలసి యుంటుంది.

అనగా ఇస్తిహాజా రక్తస్రావము అవుతుంటే, జొహర్ నమాజ్ కొరకు క్రొత్తగా వుజూ చేయాలి. మల మూత్ర విసర్జన మొదలగు వాటిచే వుజూ భంగము కానిచో, ఆ వుజూతో జొహర్ నమాజ్ యొక్క ఫర్జ్‌లతో బాటు, సున్నత్‌లు, నఫిల్ నమాజ్‌లు ఆచరించ వచ్చును. అంతే గాక అసర్ నమాజ్ కు పూర్వము వరకు ఖుర్ఆన్ పారాయణము మొదలగునవి కూడ చేయ వచ్చును. కానీ నియమము ఏమిటంటే, ఈ లోపు వుజూ భంగము కారాదు. మరల అసర్ నమాజ్ కొరకు క్రొత్తగా వుజూ చేయాలి. వుజూ భంగము కానిచో, ఈ వుజూతో మగ్రిబ్ పూర్వము వరకు అదే వుజూతో, అన్నీ కార్యములు అనగా ఖుర్ఆన్ పఠనం మొదలగునవి,

చేయ వచ్చును. ఇట్లే మిగిలిన నమాజ్‌ల కొరకు కూడ వుజూ క్రొత్తగా చేయ వలసి యుంటుంది. (బిహిష్తీ జేవర్)

## మసాయిల్

**01.** ఇస్తిహాజా వలన వస్త్రాలు అపరిశుభ్ర మవుచున్నచో, నమాజ్ కొరకు ప్రత్యేక వస్త్రాలు ఉంచుకొని, వాటిని ధరించి నమాజ్ ఆచరించాలి.

**02.** నమాజ్ చదువుతున్న సమయములో వస్త్రాలు పాడయినట్లయితే ఎటువంటి ఇబ్బంది లేదు. నమాజ్ సక్రమముగా నెరవేరినట్లే పరిగణింప బడును. కాని తరువాతి నమాజ్ కొరకు ఆ అపరిశుభ్రతను శుభ్రము చేసి వాడుకో వలెను.

**03.** నమాజ్ చదువుతున్న సమయములో శరీరానికి అశుభ్రత అంటి నట్లయితే ఎటువంటి ఇబ్బంది లేదు. నమాజ్ సక్రమముగా నెరవేరినట్లే పరిగణింప బడును. కాని నమాజ్ తరువాత ఆ అపరిశుభ్రతను దూరము చేసుకో వలెను.

**04.** నిలబడి నమాజ్ ఆచరించు సమయములో రక్తస్రావము జరుగచుండిన, కూర్చొని నమాజ్ ఆచరించిన రక్తస్రావము జరుగనిచో, కూర్చొని నమాజ్ ఆచరించ వలెను.

**05.** ఇస్తిహాజా స్థితిలో యున్న స్త్రీలు, షరీఅత్ ప్రకారము పరిశుద్ధులుగా పరిగణింప బడుదురు. కావున అటువంటివారితో సంభోగించుటలో తప్పులేదు. దానికి అనుమతి ఉన్నది. (బిహిష్తి జేవర్)

# 03. ఇహ్‌తిలామ్, జనాబత్

## 3.1. ఇహ్‌తిలామ్ (వీర్య స్ఖలనం)

నిద్రలో గానీ, మెలకువలో గానీ స్పృహలో గానీ, స్పృహ లేనప్పుడు గానీ, కామోద్రేకంతో వీర్యస్ఖలనం కలిగినచో ఏర్పడిన అశుద్ధతను 'ఇహ్‌తిలామ్' అంటారు. ఈ అశుద్ధత నుండి పరిశుభ్రత పొందుటకు గుస్ల్ తప్పని సరిగా చేయాలి. (ఇల్‌ముల్ ఫిఖహ్, 112, మసాఇలె గుస్ల్, స. 29)

## 3.2. జనాబత్ (సంభోగం)

సంభోగం (రతికార్యం) మూలంగా ఏర్పడే అశుద్ధతను జనాబత్ అంటారు. కామోద్రేకం కలిగిన పురుషుని మర్మాంగం, స్త్రీ యొక్క మర్మాంగం లోనికి గానీ,

లేక స్త్రీ పురుషుల మలద్వారం లోనికి ప్రవేశించినచో, వీర్యస్ఖలనం కలిగినను, కలుగక పోయిననూ కలిగే అశుద్ధతను 'జనాబత్' అంటారు. ఈ అశుద్ధత నుండి పరిశుభ్రత పొందుటకు గుస్ల్ తప్పని సరిగా చేయాలి. (ఇల్‌ముల్ ఫిఖహ్,112, మసాఇలె గుస్‌ల్, స.29)

## 04. నీటి యొక్క ఆదేశాలు

అశుద్ధతను తొలగించి శుద్ధతను కలిగించు అవసరమైనది నీరు. అందువల్ల ఎటువంటి నీటితో పరిశుద్ధతను పొందగలమో తెలుసుకొనుటకు నీటి యొక్క ఆదేశాలను, ఆజ్ఞలను తెలుసుకోవడం ప్రతి ముస్లిమ్ యొక్క కర్తవ్యమై యున్నది. **ఏడు రకాలైన నీటితో పరిశుద్ధతను పొంద వచ్చును.** అవి **1.** వర్షపు నీరు, **2.** సముద్రపు నీరు, **3.** నదుల నీరు, **4.** కాలువల నీరు, **5.** బావినీరు, **6.** ఊట నీరు, **7.** మంచు మరియు వడగండ్లు కరిగి నప్పుడు వచ్చే నీరు(దీనియాత్,2యం/63)

### గమనిక

**01.** మనుషులు, గుర్రం, పిల్లి మరియు ఏ జంతువుల మాంసం ముస్లిమ్‌లు తింటారో, అటువంటి జంతువులు అనగా ఒంటె, ఆవు, ఎద్దు మొదలగు ప్రాణులు ఎంగిలి చేసిన నీరు స్వయంగా శుభ్రమైనదే. అయినప్పటికీ ఆనీటితో వుజూ మరియు గుస్‌ల్ చేయడం మాత్రం 'మక్రూ' అవుతుంది.

**02.** వుజూ మొదలగు వాటికి ఉపయోగించిన నీరు, స్వయంగా శుభ్ర మైనదే. అయినప్పటికీ అదే నీటితో మరల వుజూ మరియు గుస్‌ల్ చేయటం మాత్రం తగదు.

**03.** కుక్క, పంది, క్రూర మృగాలైన చిరుత, తోడేలు మొదలగు వేటాడే జంతువులు త్రాగిన నీరు 'నజిస్' అనగా అశుద్ధమైన నీరుగా పరిగణించ బడుతుంది. ఇదే విధంగా ఎలుకను లేదా దేనినైనా అప్పుడే తిన్న పిల్లి, నీరు త్రాగితే, ఆ నీరు కూడా అశుద్ధమైనదే. సారాయి త్రాగిన తరువాత, పంది మాంసము తిన్నతరువాత వెంటనే మనిషి త్రాగి విడిచిన నీరు కూడా అపవిత్రమే. కావున దీనితో వుజూ, గుస్‌ల్ చేయుట తగదు.

**04.** పండ్లు, మొక్కలు మొదలగు వాటిని పిండగా వచ్చిన నీటిని, ఏదైనా శుభ్రమైన వస్తువును కలుపుట వలన గానీ లేక ఏదైనా వస్తువును కలిపి

వండుట వలన గానీ – రుచి, రంగు, వాసనలో మార్పు వచ్చినను లేక చిక్కగా అయినను, ఆ నీరు, పరిశుభ్రమైన నీరుగా పరిగణింప బడుతుంది. అయినప్పటికీ ఆనీటితో వుజూ మరియు గుస్ల్ చేయటం మాత్రం తగదు.

**05.** నిలచియున్న నీరు కొద్దిగా యున్న యెడల, అందు ఏదైనా అపరిశుభ్రమైన వస్తువు (నజాసత్) పడిన వెంటనే ఆనీరు అపరిశుభ్రమైనదిగా పరిగణించ బడుతుంది. కావున ఆ నీటితో వుజూ, గుస్ల్ చేయుట తగదు.

**06.** నీరు అధికంగా యుండిననూ లేక నీరు ప్రవహిస్తూ యుండిననూ, అందు అశుభ్రమైన వస్తువు (నజాసత్) పడిన ఆ నీటి రంగు, రుచి మారిపోయిన యెడల ఆనీరు అపరిశుభ్రమైనదిగా పరిగణించ బడును. కావున ఆనీటితో వుజూ, గుస్ల్ చేయుట తగదు.

**07.** నీరు అధికంగా యుండిననూ లేక నీరు ప్రవహిస్తూ యుండిననూ, అందు అశుభ్రమైన వస్తువు (నజాసత్) పడినప్పుడు ఆనీటి రంగు రుచి మారని యెడల ఆనీరు పరిశుభ్రమైనదిగా పరిగణించ బడును. కావున ఆ నీటితో వుజూ, గుస్ల్ చేయవచ్చును.

**గమనిక:** నీటి యొక్క కొలను వైశాల్యం 225 చదరపు అడుగులు యుండి, నీటిని దోసిలి లోనికి తీసుకొన్నప్పుడు, కొలను యొక్క అడుగు భాగం చేతులకు తగలకుండా యుడిన, అందులోని నీరు 'అధికమైన నీరు' (మాయె కసీర్) అనబడుతుంది. అట్లు కానిచో అది 'స్వల్పమైన నీరు' (మాయె ఖలీల్) అనబడుతుంది.

## 05. ఇస్తిన్‌జా (శుద్ధిపొందుట)

మలమూత్ర విసర్జన తరువాత శుద్ధి పొందడానికి తీసుకొనే చర్యలను ఇస్తిన్‌జా అంటారు. మలమూత్ర విసర్జన తరువాత మర్మాంగాలకు అంటుకున్న అశుద్ధతను శుభ్రం చేసుకొనుటను ఇస్తిన్‌జా అంటారు. ప్రతి ముస్లిం మూత్రం నుండి శుభ్రంగా ఉండడం అత్యంత ఆవశ్యకం. దీనివల్ల ఇహ పరలోక ప్రయోజనాలు అనేకం కలవు. ముఖ్యంగా ఇహలోకంలో అనేక వ్యాధుల నుండి రక్షణ కలుగు తుంది, పరలోకంలో మొట్టమొదటి మజిలీ అయిన సమాధి శిక్ష నుండి రక్షణ కలుగుతుంది.

## 5.1. ఇస్తిన్జా సమయంలో పాటించ వలసిన ఆదేశాలు

మలమూత్ర విసర్జన కొరకు మరుగుదొడ్డి లోనికి వెళ్ళే ముందు తలుపు బయట 'బిస్మిల్లాహ్' (అల్లాహ్ పేరుతో ప్రవేశించు చున్నాను) అని పలికి ఈ దుఆ పఠించాలి: **"అల్లాహుమ్మ ఇన్నీ అఊజుబిక మినల్ ఖుబుసి వల్ ఖబాఇస్".** (ఓ అల్లాహ్! నేను అపవిత్రులైన షైతాను మరియు జిన్నాతుల స్త్రీ, పురుషుల నుండి శరణు వేడు చున్నాను) తరువాత లోనికి వెళ్ళాలి.

శిరస్సును కప్పుకొని వెళ్ళాలి. ముందు ఎడమకాలు పెట్టి మరుగు దొడ్డి లోనికి ప్రవేశించాలి. అల్లాహ్ పేరుగానీ, హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లం గారి పేరు గానీ కలిగిన ఉంగరం గానీ లేక అలాంటివే పవిత్రమైనవి ఏవైన యుంటే వాటిని మరుగు దొడ్డి లోనికి వెళ్ళక ముందే తీసి వేయాలి. మరుగు దొడ్డిలో అల్లాహ్ పేరును స్మరించరాదు.

మరుగుదొడ్డిలో ఉన్నప్పుడు తుమ్ము వస్తే 'అల్‌హందు లిల్లాహ్' (సకల స్తోత్రములు అల్లాహ్ కే) అని మనసులో అనుకోవాలి, నోటితో ఉచ్చరించరాదు. మరుగుదొడ్డిలో ఏమియు మాట్లాడరాదు.

మూత్ర విసర్జన చేస్తున్నప్పుడు ఎత్తైన స్థలంలో కూర్చొని క్రింది వైపుకు చేయాలి. మూత్రపు చుక్కలు దుస్తులపై గానీ, శరీరంపై గానీ పడకుండా జాగ్రత్త వహించాలి. మర్మావయవమును ఎడమ చేతితోనే పట్టుకోవాలి. నిలబడి చేయరాదు. ఖిబ్లా వైపుకు ముఖం గానీ వీపు గానీ యుండరాదు.

మూత్ర విసర్జన తరువాత మట్టిబెడ్డతో మర్మాంగానికి అంటుకొని యున్న మూత్రాన్ని పీల్చుకోనివ్వాలి. మలవిసర్జన తరువాత మూడు మట్టిబెడ్డలతో గానీ టాయిలెట్ పేపర్‌తో గానీ శుభ్రం చేసుకోవాలి. ఆ తరువాత నీటితో శుభ్రంగా కడుగు కోవాలి. మట్టిబెడ్డలు మరియు నీరు, రెంటిని ఉపయోగించుట శ్రేష్ఠం. కేవలం నీరు మాత్రమే ఉపయోగించి శుభ్రం చేసుకొనినను సరిపోతుంది.

మరుగుదొడ్డి నుండి బయటకు వస్తున్నప్పుడు ముందు కుడికాలు బయటకు పెట్టాలి. బయటికి వచ్చిన తరువాత ఈ దుఆ పఠించాలి: **"గుఫ్‌రానక, అల్‌హందు లిల్లాహిల్లజీ అజ్‌హబ అన్నిల్ అజా వ ఆఫానీ"** (ఓ అల్లాహ్! నేను క్షమించమని కోరుకొంటున్నాను. చెడు (మలము) ను దూరం చేసి సౌఖ్యాన్ని ప్రసాదించిన

అల్లాహ్‌కు నా కృతజ్ఞతలు) ఇస్తిన్‌జా చేసిన తరువాత ఎడమ చేతిని నేలమీద బాగుగా రుద్ది కడగాలి లేదా మట్టితో లేదా సబ్బుతో బాగుగా రుద్ది కడగాలి. (బిహిష్తీ సమర్, ప్రథమ బాగం, పే. 44)

### మసాయిల్ (సిద్ధాంతాలు)

**01.** మల మూత్ర విసర్జన సమయంలో ఖిబ్లా వైపు ముఖం గానీ వీపు గానీ పెట్టి కూర్చోవడం నిషిద్ధం. చిన్న పిల్లలను కుడా ఇలా కూర్చో పెట్టుట నిషిద్ధమే.

**02.** ఇస్తిన్‌జా చేసిన తరువాత మిగిలిన నీటితో వుజూ చేయ వచ్చును. వుజూ చేసిన తరువాత మిగిలిన నీటితో ఇస్తిన్‌జా కూడా చేయ వచ్చును. కానీ ఇట్లు చేయకుండుటయే మంచిది. (బిహిష్తీ సమర్, ప్రథమ బాగం, పే. 44)

## 5.2. మలమూత్ర విసర్జన సమయంలో చేయరాని పనులు

"మాట్లాడడం, అనవసరంగా దగ్గడం, ఖుర్‌ఆన్ సూక్తులు, హదీసు వాక్యాలు, మరేవైనా పవిత్ర వాక్యాలు పఠించడం, అల్లాహ్ పేరు గానీ, హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారి పేరుగానీ, అల్లాహ్ దూతల పేర్లు గానీ ఖుర్‌ఆన్ సూక్తులు, హదీసు వాక్యాలు, దుఆలు గానీ లిఖించ బడిన వాటిని ఉంచడం" చేయరాదు. ఇటువంటివి గుడ్డలో చుట్టి గానీ తావీజులో గానీ జోబులో గానీ ఉంటే పరవాలేదు.

అనవసరంగా నిలబడి లేక పరుండి మల మూత్ర విసర్జన చేయుట, నగ్నమై మల మూత్ర విసర్జన చేయుట, చంద్రుని వైపు, సూర్యుని వైపు ముఖం గానీ వీపు గానీ ఉంచి మలమూత్ర విసర్జన చేయుట అవాంఛనీయం (మక్రూహ్).

కాలువ లేదా చెరువు ఒడ్డున మల మూత్ర విసర్జన చేయుట అవాంఛనీయం (మక్రూహ్). మల మూత్రాలు అందులో పడక పోయినను అవాంఛనీయమే (మక్రూహ్).

ప్రజలు విశ్రాంతి తీసుకొనే చెట్ల క్రింద గానీ, పండ్లు, పూలు గల చెట్ల క్రింద గానీ, జంతువుల మధ్య గానీ, భక్తులకు దుర్వాసన కలిగే విధంగా మసీదు, ఈద్‌గాహ్‌లకు సమీపంలో గానీ, స్మశానవాటిక యందు గానీ, ప్రజలు వుజూ, గుస్ల్ చేయు ప్రదేశాలలో గానీ, రంధ్రం (కన్నం) లో గానీ, దారి (రోడ్డు) లో గానీ, గాలి వీచే వాటం వైపు గానీ, యాత్రికులు లేక ప్రజలు విడిది చేసియున్న

ప్రదేశానికి సమీపంలో గానీ, మల మూత్ర విసర్జన చేయుట తప్పక త్యజించ వలసిన విషయం (మక్రూహె తహ్రీమీ).

పై వాటివల్ల తెలిసినదేమనగా, ప్రజలు కూర్చునే ప్రదేశాలలో, ప్రజలు వస్తూ పోతూ యుండే ప్రదేశాలలో, ప్రజలకు ఇబ్బంది కలుగు ప్రదేశాలలో, ప్రవహించి ప్రజలు ఉన్న చోటుకు చేరే ప్రమాదమున్న ప్రదేశాలలో, మలమూత్ర విసర్జన చేయుట తప్పక త్యజించ వలసిన విషయం (మక్రూహె తహ్రీమీ).

## గమనిక

**01.** రాత్రి గానీ పగలు గానీ నిద్ర పోయి మేల్కొన్న తరువాత చేతులు (శుభ్రంగా యుండినను నీటితో) కడుగనిదే (వుజు, ఇస్తిన్‌జాల కొరకు) నీటిలో ముంచరాదు. (బిహిష్తీ సమర్, ప్రథమ బాగం, పే.43)

**02.** మలమూత్ర విసర్జనకు వెళ్ళినప్పుడు మర్మాంగమును కుడిచేతితో తాకరాదు. ఇస్తిన్‌జా కూడా కుడి చేతితో చేయరాదు. (ముస్లిమ్)

**03.** స్నానాలగది గచ్చు చేయబడి యుండి విసర్జించిన మూత్రం నీటితో కలిసి బయటికి పోయేట్లు యుంటే, అటువంటి స్నానాల గది యందు మూత్ర విసర్జన చేయవచ్చును. అట్లు కానిచో, మలమూత్ర విసర్జన చేసినచో మక్రూహె తహ్రీమీ అగును. కావున చేయరాదు (తిర్మిజీ, ఈజాహుల్ మసాయిల్, స.19)

## 6. వుజూ వివరణము

అల్లాహ్‌ను ఆరాధించటానికి నిర్దేశించబడిన అతిముఖ్యమైన పద్ధతి నమాజ్. ఈ నమాజ్‌ను ఆచరించుటకు 'తహారత్' అనగా పరిశుభ్రత తప్పనిసరి. ఈ తహారత్ రెండు రకాలు. **01.** తహారతె సుగ్‌ర అనగా హదసె అస్‌గర్ (చిన్న అశుద్ధత). దీని నుండి పరిశుభ్రత పొందు పద్ధతిని వుజూ అంటారు. **02.** తహారతె కుబర అనగా హదసె అక్బర్ (పెద్ద అశుద్ధత) దీని నుండి పరిశుభ్రతను పొందు పద్ధతిని గుస్‌ల్ అంటారు.

శరీరం నుండి మలం, మూత్రం, అపాన వాయువు (మలద్వారం నుండి గాలి బయటకు వచ్చుట, పిత్తు) నెత్తురు కారుట, చీము కారుట మొదలగు వానిచే ఏర్పడు అపరిశుభ్రతను ఇస్లాం ధర్మశాస్త్రంలో హదసె అస్‌గర్ (చిన్న అశుద్ధత) అని అంటారు.

ఈ హదసె అస్గర్ నుండి పరిశుభ్రతను పొందుటకు ఒక ప్రత్యేకమైన పద్ధతిలో ముఖం, చేతులు, కాళ్ళు కడుగుకొనుట మరియు మసహ్ (తల, చెవులపై తడి చేతులతో స్పర్శించుట) చేయటాన్ని వుజూ అంటారు.

నమాజ్ ఆచరించుటకు ముందు హదసె అస్గర్ నుండి పరిశుభ్రత పొందుట తప్పనిసరి. వుజూ చేయుటచే ఈ పరిశుభ్రత కలుగును. హదీసులలో ఈ విధంగా పేర్కొనబడి యున్నది:

వుజూ: నమాజ్ యొక్క తాళపు చెవి.

నమాజ్: స్వర్గపు తాళపు చెవి. (ఇబ్నె మాజ, దీనియాత్ 1 యం)

## 6.1. వుజూ కొరకు ఆదేశము

దివ్యఖుర్ఆన్‌లో అల్లాహు తఆలా ఇట్లు ఆదేశంచెను: ఓ విశ్వాసులారా! మీరు నమాజ్ ఆచరించుటకు ఉద్దేశించి నప్పుడు, మీ ముఖాలను, మోచేతులతో సహా మీ రెండు చేతులను కడుగుకోండి. తడిచేతులతో తలను చెవులను స్పర్శించండి, రెండు కాళ్ళను చీలమండలంతో సహా కడుగుకోండి.

నమాజ్ సమయం ఆసన్నమైనప్పుడు, ముందుగా సున్నత్ ప్రకారం బాగుగా వుజూ చేయాలి. అల్లాహు తఆలా యొక్క దర్బారులో హాజరు కావడానికి, అల్లాహ్‌ను ఆరాధించడానికి ఈ తహారత్, వుజూ తప్పనిసరి.

## 6.2. వుజూ యొక్క శ్రేయోశుభాలు/అనుగ్రహాలు

అనంత కరుణామయుడైన అల్లాహు తఆలా ఈ వుజూ మూలంగా కూడా అనేక అనుగ్రహాలు, శుభాలు ప్రసాదించి, మనకు మహోపకారం చేశాడు. హదీసులో ఈ విధంగా పేర్కొనబడి యున్నది: వుజూ చేసినప్పుడు ఏయే అవయవాలు కడుగబడుతాయో, వాటి మూలంగా చేయబడిన పాపాలు (సగీరా గునాహ్/చిన్నచిన్న పాపాలు) క్షమించబడతాయి, ఆ పాపాల దుష్ప్రభావం వుజూ నీటిచే కడిగివేయ బడుతుంది. (ఇస్లాం క్యా హై? పే.26)

ఇంకొక హదీసులో ఇలా ఉంది: వుజూ చేయడం వలన చిన్నచిన్న పాపాలు కడిగివేయబడతాయి. వుజూ చేసినవాడు పరలోకంలో ఉన్నత స్థానాన్ని పొందగలడు. వుజూ వల్ల మొత్తం శరీర పాపాలు రాలిపోతాయి. (బుఖారీ, ముస్లిం)

వుజూ ఘనతను, దాని వల్ల కలిగే శుభాలను గూర్చి తెలుయజేయు హాదీసులు అనేకం కలవు. స్థలాభావం వల్ల ఇక్కడ పేర్కొనడం లేదు.

## 6.3. వుజూలోని ఫర్జ్‌లు

వుజూలో నాలుగు ఫర్జ్‌లు కలవు. ఇవి చాల ముఖ్యమైనవి. వీటిలో ఏ ఒక్కటి విడిచి పెట్టినను వుజూ కాదు. అవి:

**01.** ముఖమంతా ఒకసారి కడగడం. ముఖమంతా అంటే నుదుటి పైని ముంగురుల నుంచి గడ్డం క్రింది వరకు, ఒక చెవి లోలకు నుంచి ఇంకొక చెవి లోలకు వరకు అని అర్థం.

**02.** రెండు చేతుల్ని మోచేతులతో సహా ఒకసారి కడగడం.

**03.** నాల్గోవంతు (1/4) తల మసహ్ చేయడం, అంటే తడిచేతులతో తుడవడం.

**04.** రెండు పాదాలను చీలమండలంతో సహా ఒకసారి కడగడం.

**గమనిక:** ఈ నాలుగు భాగాలను వెంట్రుకవాసి కూడా విడవకుండా కడగాలి.

## 6.4. వుజూ లోని సున్నతులు

వుజూలో కొన్నింటిని విడిచి పెట్టినను వుజూ అయిపోతుంది. కాని సున్నత్ యొక్క పుణ్యఫలము లభించదు. వాటిని సున్నత్‌లు అంటారు. వుజూలో 17 సున్నతులు కలవు.

**01.** వుజూ యొక్క నియ్యత్ (సంకల్పం) చేయడం. (బుఖారీ)

**02.** 'బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీం' పఠించి వుజూ ప్రారంభించడం. (నసయి)

**03.** రెండు చేతులను మణికట్టు (ముంజేతుల) వరకు కడుగుకోవడం. (బుఖారీ)

**04.** మిస్వాక్ చేయడం. అనగా పళ్ళుతోము పుల్లతో పళ్ళు తోమడం. పళ్ళుతోము పుల్ల లేనిచో చూపుడు వ్రేలితో పళ్ళు తోమాలి. (బుఖారీ)

**05.** మూడుసార్లు పుక్కిలించడం. (బుఖారీ)

**06.** మూడుసార్లు ముక్కు లోనికి నీరు పంపి శుభ్రం చేయడం. (బుఖారీ)

**07.** మూడుసార్లు ముక్కు చీదడం.

**08.** ప్రతి అవయవాన్నీ మూడుసార్లు కడగడం. (ఇబ్నెమాజ)

**09.** గడ్డాన్ని మూడుసార్లు ఖిలాల్ చెయ్యడం. అంటే చేతివ్రేళ్ళతో దువ్వడం.

**10.** రెండు కాళ్ళ వ్రేళ్ళ మధ్య, రెండు చేతుల వ్రేళ్ళ మధ్య చేతివ్రేళ్ళతో ఖిలాల్ చేయడం, అంటే వ్రేళ్ళతో కదిపి శుభ్రపరచడం. ఉంగర ముండిన దానిని కదిపి నీరు లోనికి పోయేట్లు చేయాలి. (తిర్మిజీ)

**11.** మొత్తం తల యొక్క మసహ్ చేయడం, అంటే తడిచేతులతో తుడవడం. (బుఖారీ)

**12.** తల యొక్క మసహ్‌తో పాటు, రెండు చెవుల మసహ్ చేయడం. (ఇబ్నెమాజ)

**13.** వుజూలో అవయవాలను రుద్ది రుద్ది కడగడం.

**14.** ఆలస్యం చేయకుండా, వెంటవెంటనే అవయవాలను కడగడం. (ముఅత్తా మాలిక్)

**15.** ప్రతి అవయవాన్నీ మూడేసిసార్లు కడగడం.

**16.** క్రమ పద్ధతిలో సున్నత్ ప్రకారం కడగడం. (బుఖారీ)

**17.** వుజూ చేయడం పూర్తి అయిన తరువాత మస్నూన్ దుఆ పఠించడం.

## 6.5. వుజూను భంగపరచే విషయాలు (నవాఖిజె వుజూ)

ఈ క్రింది 8 కారణాల వల్ల వుజూ భంగమై పోతుంది. వీటిని నవాఖిజె వుజూ అంటారు.

**01.** మల మూత్ర విసర్జన లేదా మల మూత్ర ద్వారాల మూలంగా మరేదైనా పదార్థం వెలువడడం. ఉదా: రాళ్ళు, నులిపురుగు, రక్తం మొదలగునవి.

**02.** రీహ్ అనగా మలద్వారం నుండి గాలి (ఆపానవాయువు) వెలువడడం.

**03.** శరీరంలోని (ఏ భాగం నుండైనా) రక్తం కానీ చీము కానీ కారడం.

**04.** నోటి నిండా వాంతి కావడం.

**05.** పడుకొని లేదా దేనినైనా ఆనుకొని నిద్రపోవడం.

**06.** ఏదైనా వ్యాధి వలన గానీ లేక వేరే కారణం వలన గానీ స్పృహ కోల్పోవడం. (అపస్మారక స్థితికి వెళ్ళడం)

**07.** పిచ్చివాడై పోవడం.

**08.** నమాజ్‌లో బిగ్గరగా నవ్వడం. (బిహిష్తీజేవర్,స. 74, దీనియాత్ 1 యం, స.86)

## 6.6. వుజూ యొక్క దుఆలు

### 6.6.1. వుజూ ప్రారంభించుటకు పూర్వం

**1. "బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్"**

**అర్థం:** అత్యంత కరుణామయుడు, అపార కృపాశీలుడు, అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభించు చున్నాను.

**2. బిస్మిల్లా హిల్ అజీమి వల్‌హమ్‌దు లిల్లాహి అలా దీనిల్ ఇస్లామ్.**

**అర్థం:** సర్వోన్నతుడు, మరియు సకల ప్రశంసలకు అర్హుడైన అల్లాహ్ పేరుతో ఇస్లాం ధర్మాన్ని అనుసరిస్తూ, ప్రారంభించు చున్నాను.

### 6.6.2. వుజూ మధ్యలో (వుజూ చేస్తున్నప్పుడు)

**అల్లాహు మ్మగ్‌ఫిర్ లీ జమ్‌బీ వ వస్సిత్‌లీ ఫీ దారీ వ బారిక్ లీ ఫీ రిజ్‌ఖీ.** (నసయి)

**అర్థం:** ఓ అల్లాహ్! నా పాపాలను క్షమించు, నా గృహమందు అభివృద్ధిని కలిగించు, నా ఉపాధిలో సమృద్ధిని ప్రసాదించు.

### 6.6.3. వుజూ పూర్తి అయిన తరువాత చేయు దుఆలు

**1.** ఆకాశం వైపు చూస్తూ ఈ దుఆ పఠించ వలెను:

**1. "అష్‌హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహు వహ్‌దహూ లాషరీక లహూ వ అష్‌హదు అన్న ముహమ్మదన్ అబ్‌దుహూ వ రసూలుహ్".** (మిష్కాత్)

**అర్థం :** అల్లాహ్ తప్ప మరెవరూ ఆరాధింప బడుటకు యోగ్యులు కారని మరియు ఆయన ఒక్కడే అని, ఆయనకు ఎవ్వరును సాటిలేరని నేను సాక్ష్యమిచ్చు చున్నాను, మరియు ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లం ఆయన (అల్లాహ్ యొక్క) దాసుడు మరియు ప్రవక్త (సందేశ హరుడు) అని కూడా నేను సాక్ష్యమిచ్చు చున్నాను.

**2. అల్లాహుమ్మజ్‌అల్‌నీ మినత్తవ్వాబీన వజ్‌అల్‌నీ మినల్ ముతతహ్హిరీన్.** (ముస్లిం)

అర్థం: ఓ అల్లాహ్! నన్ను తౌబ చేయువారు (పశ్చాత్తాపపడి క్షమాపణవేడువారు) ను, పరిశుద్ధులును, పవిత్రులును అయిన వారిలో చేర్చుము.

## 6.7. వుజూ ఆచరించే సున్నత్ పద్ధతి

నీళ్ళ తుంపరలు పైన పడకుండా ఉండేందుకు కొద్దిగాను ఎత్తు ప్రదేశంలో కూర్చోవాలి. ఖిబ్లా వైపుకు తిరిగి కూర్చోవాలి. పరిశుభ్రమైన నీటిని తీసుకోవాలి.

అల్లాహ్‌ను సంతోషపరచుట కొరకు మరియు పరిశుభ్రతను పొందుటకు వుజూ చేస్తున్నాను అని సంకల్పం (నియ్యత్) చేసుకోవాలి. తరువాత "బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీం" పఠించాలి. తరువాత వుజూ చేయుట ప్రారంభించాలి.

రెండు చేతులను మణికట్టు వరకు మూడు సార్లు కడుక్కోవాలి. మిస్వాక్ (దంతాలు తోము పుల్ల) తో దంతాలు శుభ్రంగా తోముకోవాలి. మిస్వాక్ లేకపోతే కుడిచేతి చూపుడు వ్రేలితో దంతాలు శుభ్రం చేసుకోవాలి.

ఉపవాసం లేనిచో, నోటిలో నీరు పోసుకొని నోరంతా శుభ్రమయ్యే విధంగా గరగరా (గార్లింగ్) చెయ్యాలి. ఒకవేళ ఉపవాసం ఉంటే, నోటిలో నీరు పోసుకొని నోరంతా శుభ్రమయ్యే విధంగా పుక్కిలించాలి. ఇట్లు 3 సార్లు చెయ్యాలి.

ముక్కులో నీరు ఎక్కించి, ఎడమ చేతి చిటికిన వ్రేలితో ముక్కును శుభ్రం చేసి చీదెయ్యాలి. ఇట్లు 3 సార్లు చెయ్యాలి. ఒకవేళ ఉపవాసం ఉంటే, ముక్కులోని మెత్తని కండరం పైభాగానికి నీరు చేరకుండా జాగ్రత్త వహించాలి.

తరువాత ముఖ మంతయు 3 సార్లు కడుగుకోవాలి. ఒక చెవి కమ్మె (తమ్మి) నుండి రెండవ చెవి కమ్మె (తమ్మి) వరకు, నుదుటి వెంట్రుకల నుండి గడ్డం క్రింది వరకు, గడ్డంతో సహా పూర్తిగా కడగాలి. వెంట్రుకవాసి కూడ తడవకుండ యుండ కూడదు. గడ్డం వ్రేళ్ళ పాదులు తడిచేలా తడిచేతి వ్రేళ్ళతో గడ్డాన్ని ఖిలాల్ చేయాలి, అనగా దువ్వాలి.

తరువాత రెండు చేతులను, మోచేతులతో సహా 3 సార్లు శుభ్రంగా కడుగుకోవాలి. ముందుగా కుడిచేయి తరువాత ఎడమ చేయి కడగాలి. ఒక చేతి వ్రేళ్ళు మరొక చేతి వ్రేళ్ళలో వేసి ఖిలాల్ చేయాలి. వ్రేలికి ఉంగరం గానీ కాలి మెట్టెలు ఉంటే వాటిని అటు ఇటు కదిలించి, దాని క్రిందికి నీరు చేరేట్లు చూడాలి.

తరువాత రెండు చేతులను తడుపుకొని, తడిచేతులతో తలను, చెవులను ఒకసారి మసహ్ చెయ్యాలి. మసహ్ చేసే పద్ధతి ఏమనగా, రెండు చేతుల బొటన వ్రేళ్ళను, చూపుడు వ్రేళ్ళను వేరుగా ఉంచి, మిగతా మూడు వ్రేళ్ళని కలిపి, వాటి లోపలి భాగంతో, తలమీద నుదుటి వైపు నుంచి వెనుక భాగం దాకా స్పర్శించాలి. తరువాత రెండు చేతుల అరచేతి భాగాలతో, తల వెనుక భాగం నుంచి నుదుటి దాకా స్పర్శించాలి. ఆ తరువాత రెండు చేతుల చూపుడు వ్రేళ్ళతో

రెండు చెవుల లోపలి భాగాన్ని, రెండు చెవుల బొటన వ్రేళ్ళతో రెండు చెవుల వెలుపలి భాగాన్ని స్పర్శించాలి. తరువాత రెండు ముంజేతుల వెనుక భాగంతో మెడను స్పర్శించాలి.

తరువాత రెండు కాళ్ళను మడమలతో సహా శుభ్రంగా కడగాలి. ముందు కుడికాలు తరువాత ఎడమకాలు కడగాలి. ఎడమ చేతి చిటికిన వ్రేలితో కాలి వ్రేళ్ళలో ఖిలాల్ చేయాలి. మొదట కుడికాలు కడిగిన తరువాత ఎడమ చేతి చిటికిన వ్రేలితో కుడికాలు చిటికిన వ్రేలు నుండి ప్రారంభించి బొటన వ్రేలి వరకు, ఖిలాల్ చేయాలి. తరువాత ఎడమకాలు కడిగి, ఎడమ చేతి చిటికిన వ్రేలితో ఎడమకాలు ఖిలాల్ కూడ చేయాలి.

వుజూ చేసేటప్పుడు ప్రతి అవయవం, అనగా ముఖం, కాళ్ళు, చేతులు బాగుగా రుద్ది శుభ్రంగా కడగాలి. వుజూ ఆగి ఆగి కాకుండా నిర్విరామంగా చేయాలి. తరువాత సాంప్రదాయిక దుఆలు చదవాలి. (బిహిష్తీ జేవర్, స. 45)

## మసాయిల్

**01.** వుజూ చేసి నమాజ్ ఆచరించిన తరువాత, వుజూ భంగం కాకుండినచో తరువాతి సమయంలో ఆచరించ వలసిన నమాజ్ కూడా అదే వుజూతో ఆచరించ వచ్చును. కానీ మరల వుజూ చేస్తే అధిక పుణ్యఫలం లభిస్తుంది.

**02.** తన మర్మావయము గాని, ఇతరుల మర్మావయము గాని చూచుట వలన వుజూ భంగము కాదు, కాని ఇతరుల మర్మావయములను (సతర్) చూచుట పాపము.

**03.** అశక్తులు (మాజూర్) ఫర్జ్ నమాజ్ సమయమైన ప్రతీసారీ కొత్తగా వుజూ చేయవలసి యుంటుంది. (బిహిష్తీ జేవర్)

## గమనిక

**01.** ఇస్లామీయ ధర్మశాస్త్రము (షరీఅత్) ప్రకారము అశక్తులైన వారికి (మాజూర్‌లకు) కొన్ని ప్రత్యేక సదుపాయాలు ఉన్నాయి. ఎడతెరిపి లేకుండా వుజూ భంగమయ్యే సందర్భాలు ఎదుర్కొనేవారు మాత్రమే వుజూ విషయముగా అశక్తులుగా పరిగణింపబడుతారు. ఉదా: మూత్రము చుక్కలు చుక్కలుగా కారుట, ఆపాన వాయువు మాటిమాటికి వెలువడుట మొదలగునవి. ఏదైనా ఫర్జ్ నమాజ్

కొరకు వుజూ చేసిన, కనీసము ఆ నమాజ్ ఆచరించక ముందే వుజూ భంగమై పోయినచో, అటువంటి వారిని అశక్తులు (మాజూర్) అందురు. ఇది ప్రారంభ దశ. ఆ తరువాత మరో నమాజ్ సమయములో మూత్రము గానీ ఆపాన వాయువు గానీ ఎడతెరిపి లేకుండా రాకాపోయినను, ఒకటి రెండు పర్యాయములు ఆటంకము కలిగినను, అటువంటి వారిని కూడా అశక్తులుగానే పరిగణించెదరు. కానీ ఒక నమాజ్ సమయము గడచిపోయేంత వరకు వుజూ భంగము కానిచో, అతనిని అశక్తులు (మాజూర్) గా పరిగణింపరాదు.

**02.** ఎవరైతే ఇంటి యందు వుజూ చేసి నమాజ్ కొరకు మసీదుకు వెళ్తారో, వారి ప్రతి అడుగుకు పుణ్యాలలో ఒక స్థాయి ఆధిక్యత కలుగుతుంది, ఒక పాపం క్షమించ బడుతుంది. (బుఖారీ,1/98)

**03.** సముద్రపు సమీపంలో వున్ననూ, వుజూలో అవయవాలను 3 సార్ల కన్నా ఎక్కువగా కడగడాన్ని, అవసరం కన్నా ఎక్కువగా నీటిని వాడడాన్ని, మన ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం గారు అతిగాను, వృధా కార్యంగాను పేర్కొనిరి. దీనిని తీవ్రంగా ఆక్షేపించిరి. (నిసాయి,1/141,ఇబ్నెమాజ, /34)

**హెచ్చరిక**

మనలో చాలా మంది నీటి కొళాయిని తెరచి యుంచి మిస్వాక్ చేసుకుంటూ యుంటారు, మసహ్ చేసుకుంటూ యుంటారు. నీళ్ళు ప్రవహిస్తూ యుంటాయి. ఇది చాల పాపకార్యం. అల్లాహు తఆలా యొక్క సౌభాగ్యాన్ని నిరాదరణ చేసిన వార మౌతాము. కావున దీని నుండి జాగ్రత్త వహించండి.

## 07. గుస్ల్ (స్నానం) వివరణము

భార్యా భర్తల సంభోగం (జనాబత్), వీర్య స్థలనం (ఇహ్‌తిలామ్), ఋతు రక్తం (హైజ్) మరియు బాలింతకు రక్తస్రావం (నిఫాస్) మూలంగా ఏర్పడే అశుద్ధతను హదసె అక్బర్ (పెద్ద అశుద్ధత) అందురు. నమాజ్ ఆచరించుటకు హదసె అక్బర్ నుండి పరిశుద్ధత పొందడం తప్పని సరి. హదసె అక్బర్ నుండి పరిశుద్ధతను పొందుటకు గుస్ల్ చేయవలసి యుంటుంది.

గుస్ల్ అనగా స్నానం చేయుట అని అర్థం. ధర్మశాస్త్ర పరిభాషలో గుస్ల్

అనగా ఒక ప్రత్యేకమైన సాంప్రదాయ పద్ధతిలో శరీరము యొక్క బాహ్య అవయవాల నన్నింటిని అనగా తల నుండి కాళ్ళ వరకు పరిశుభ్రంగా కడుగుటను గుస్ల్ అంటారు. ఇది హదసె అక్బర్ నుండి పరిశుద్ధతను పొందు ఉద్దేశ్యంతోను పుణ్యార్జన ఉద్ధేశ్యంతోను, (జుముఅ, పండుగ సమయాలలో చేసే గుస్ల్ మొదలగునవి) చేయుదురు.

## 7.1. గుస్ల్ లోని ఫర్జ్‌లు

గుస్ల్‌లో 3 ఫర్జ్‌లు ఉన్నాయి. అవి:

**01.** నోటి నిండ నీరు తీసుకొని పుక్కిలించడం.

**02.** ముక్కులోనికి నీరు ఎక్కించి శుభ్ర పరచడం.

**03.** వెంట్రుకవాసి కూడా పొడిగా లేకుండ శరీరంపై నీరు ప్రవహింప చేయడం.

## 7.2. గుస్ల్ లోని సున్నతులు

**01.** పరిశుభ్రత కొరకు సంకల్పం (నియ్యత్) చెయ్యడం.

**02.** రెండు చేతులు మణికట్టు వరకు శుభ్రంగా కడుగుకోవడం.

**03.** ఇస్తిన్‌జా చేయడం. (మలమూత్ర విసర్జన తరువాత శుద్ధి పొందుట)

**04**. శరీరంపై ఎక్కడైన మలినం అంటియున్న, దానిని శుభ్రం చేయడం.

**05.** వుజూ చేయడం.

**06.** శరీరమంత 3 సార్లు నీళ్ళు ప్రవహింప జేయడం.

**07.** ముందు తలపైన, తరువాత కుడి భుజం పైన, తరువాత ఎడమ భుజం పైన క్రమంగా నీరు ప్రవహింప జేయడం.

**08.** ఎక్కడైన నీరు చేరక యున్నచో, చేతితో బాగుగారుద్ది నీరు చేరేట్లు చూడడం.

## 7.3. గుస్ల్ ఎప్పుడు ఫర్జ్ (విధి) అవుతుంది?

01. సంభోగం (జిమ) జరిగి నపుడు, వీర్యస్ఖలనం అయిననూ, కాక పోయిననూ.

02. నిద్రలో గానీ మెలకువలో గానీ వీర్యస్ఖలనం కలిగి నపుడు.

03. హైజ్ (బహిష్టు) మరియు నిఫాస్ (కాన్పు) ల రక్తం ఆగినపుడు.

## 7.4. గుస్ల్ ఆచరించే సాంప్రదాయక పద్ధతి

గుస్ల్ చేసే ఉద్దేశంతో స్నానాల గది లోనికి వెళ్ళక ముందు ఈ దుఆ

చదవాలి: **"అల్లాహుమ్మ ఇన్నీ అస్ అలుకల్ జన్నత వ అఊజు బిక మినన్నార్"** (ఓ అల్లాహ్! నేను నీనుండి స్వర్గాన్ని అర్థించు చున్నాను మరియు నరకం నుండి రక్షణ అర్థించు చున్నాను) (అమలుల్ యౌమ్ వల్లైలా, ఇబ్నెసున్నీ)

అన్నిటి కంటే ముందు, రెండు చేతులు మణికట్టు వరకు మూడు సార్లు శుభ్రంగా కడుగుకోవాలి. ఇస్తిన్జా చేయాలి. (మలమూత్ర విసర్జన చేసి శుద్ధి పొందాలి) శరీరంపై ఎక్కడైనా మలినం అంటియున్న, దానిని శుభ్రంగా కడిగి వేయాలి. తరువాత "జనాబత్ (సంభోగం) / ఎహ్‌తిలామ్ (వీర్యస్ఖలనం) / హైజ్ (ముట్టు) / నిఫాస్ (పురుటి రక్తస్రావం) – నుండి శుభ్రత పొందుటకు గుస్ల్ చేస్తున్నాను" అని సంకల్పం (నియ్యత్) చేసుకోవాలి. తరువాత సాంప్రదాయక పద్ధతి (సున్నత్) ప్రకారం వుజూ చేయాలి. గుస్ల్ చేసే చోట స్నానపు నీరు కాళ్ళ క్రింద నిలబడేట్లు యుంటే, చివరలో కాళ్ళు కడుగుకో వలెను లేనిచో వుజూ చేసే సమయంలోనే కాళ్ళు కడుగుకోవాలి. తరువాత 3 సార్లు నోటి నిండ నీరు తీసుకొని గరగరా చేసి పుక్కిళించాలి. తరువాత 3 సార్లు ముక్కు లోని మెత్తని ఎముక వరకు నీరు ఎక్కించి ఎడమ చేతి చిటికిన వ్రేలితో శుభ్రం చేయాలి.

తరువాత ముందు తలపై, తరువాత కుడి భుజంపై, తరువాత ఎడమ భుజంపై నీళ్ళు పోసుకోవాలి. శరీరమంతా అనగా తల నుండి కాళ్ళ వరకు పూర్తిగా తడిసే విధంగా నీరు పోసుకోవాలి. శరీరాన్ని చేతులతో బాగుగా రుద్దుకోవాలి. వెంట్రుకవాసి కూడ పొడిగా యుండ కుండా చూడాలి. ఇట్లు మూడు సార్లు చేయాలి. మురికిని పోగొట్టుటకు నీళ్ళతో పాటు సబ్బు మొదలగునవి ఉపయోగించ దలచుకొంటే, ఉపయోగించుకో వచ్చును.

## హెచ్చరిక

**01.** కొందరు స్త్రీలు అరబీలో నియ్యత్, కలిమాలు పఠించి స్నానము చేయు నీటిపై ఊదుట తప్పనిసరి అని భావిస్తారు. ఇట్లు తలపోయుట అవివేకము మరియు అజ్ఞానమే. షరీఅత్‌లో ఇటువంటి దేమియు లేదు. గుస్ల్ సంకల్పము మనసులో భావించినను లేక నోటితో పలికినను సరిపోతుంది. నీటిమీద ఊదడము మొదలగునవి పనికిమాలిన పనులు. వీటిని విడిచి పెట్టాలి.

**02.** సరియైన కారణము లేనిదే, గుస్ల్ చేయకుండా జనాబత్ (అపవిత్ర)

స్థితిలో ఉండరాదు. నమాజ్ ఖజా అయ్యేటంతటి ఆలస్యము చేయుట పాపము. అపవిత్రులున్నచోట కారుణ్య దూతలు రారని మన ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లం గారు తెలిపిరి. కావున గుస్ల్ అవసరమైనప్పుడు ఆలస్యము చేయరాదు.

## మసాయిల్

**01.** గుస్ల్ చేసినప్పుడు, వెంట్రుకవాసి కూడా పొడిగా (తడవకుండా) యుండరాదు. అట్లు ఉండినచో, గుస్ల్ పూర్తి కాదు. ఇలాగే గుస్ల్ చేస్తున్నప్పుడు పుక్కిలించుట మరచిపోయినను, ముక్కులో నీరు ఎక్కించి శుభ్రం చేయడం మరచి పోయినను, గుస్ల్ పూర్తి కాదు. (బిహిష్తీ సమర్, హిస్సా అవ్వల్, స.27)

**02.** గుస్ల్ పూర్తి అయిన పిమ్మట, ఫలాన ప్రదేశం తడవలేదని తెలిసినచో, మరల గుస్ల్ చేయవలసిన అవసరం లేదు. తడవని ఆ ప్రదేసాన్ని నీటితో కడిగిన సరిపోతుంది. (బిహిష్తీ సమర్, హిస్సా అవ్వల్, స.27)

**03.** స్త్రీలు కప్పి ఉంచ వలసిన సతర్ అగుపడేట్లు ఇతర స్త్రీల ముందు స్నానము చేయుట పాపాకార్యము. కొందరు స్త్రీలు ఇతర స్త్రీల ముందు నగ్నముగా స్నానము చేస్తారు, ముఖ్యముగా బాలింతరాలుకు స్నానము చేయునప్పుడు. ఇది పొరపాటు, మరియు పాపము కలుగును. కాబట్టి విడిచి పెట్టాలి.

**04.** ఎవ్వరూ చూడటానికి వీలులేని ఏకాంత ప్రదేశములో వివస్త్రగా అనగా బట్టలు లేకుండా కూడ స్నానము చేయవచ్చును. అటువంటి సమయాన కూర్చొని స్నానము చేయవలెను. నగ్నముగా స్నానము చేయునపుడు ఖిబ్లా వైపుకు అభిముఖముగా కూర్చొన రాదు. దుఆ చేయడం, మాట్లాడడం చేయరాదు.

## గమనిక

**01.** రెండు చేతులను మణికట్టు వరకు శుభ్రంగా కడుగనిదే, నీటితో నిండిన కుండలో గానీ, బిందెలో గానీ, హౌజ్‌లో గానీ లేక ఏ ఇతర వాటిలో గానీ చేతులు ముంచరాదు. ఈ విషయాన్ని గుర్తుంచుకొని, జాగ్రత్త వహించాలి.

**02.** స్నానము చేసిన నీటి తుంపరలు, స్నానం చేసే నీటియందు పడకుండుటకు గాను, నీటి పాత్రను కొంచెం ఎత్తైన స్థలంలో యుంచుకోవాలి.

**03.** జనాబత్ మొదలగు వాటి నుండి పరిశుభ్రత పొందుట వేరు, శరీరపు మాలిన్యాన్ని/మురికిని పోగొట్టుట వేరు.

**04.** నీరు ఎక్కువగా వాడితే, వ్యాధిగ్రస్థుని వ్యాధి ఎక్కువౌతుందని భావించినప్పుడు, శరీరపు మాలిన్యాన్ని/మురికిని వదిలించుకోకుండానే, కొద్ది నీటితో జనాబత్ మొదలగు వాటి నుండి పరిశుభ్రతను పొందుటకు గుస్ల్ చేయ వచ్చును.

**05.** వైద్యుడు నీటితో గుస్ల్ చేసిన వ్యాధి అధికమౌతుందని వ్యాధిగ్రస్థుని హెచ్చరించినచో, నీటిని ఉపయోగించకుండానే 'తయమ్ముమ్' చేసి పరిశుభ్రతను పొందవచ్చును. (బిహిష్తీ జేవర్, దీనియాత్ 1యం స. 87)

**06.** ప్రతివారము గోళ్ళు కత్తిరించుకొని, నాభి క్రింది వెంట్రుకలను, చంకలోని వెంట్రుకలను తొగించి, స్నానము చేసి శరీరాన్ని పరిశుభ్రముగా ఉంచుట ముస్తహబ్ అయియున్నది. వారానికి ఒకసారి కాకపోయిచో, 15 రోజుల కొకసారైనా చేసుకోవాలి. అదీ కాని యెడల గరిష్టముగా 40 రోజుల లోపు ఈ శుభ్రతను పొందాలి. ఇంతకన్నా ఎక్కువ సమయమైనచో, పాపము కలుగును. ఆ వ్యక్తి పాపి అగును. స్త్రీలు బ్లేడ్, రేజర్ ఉపయోగంచుట కన్నా వెంట్రుకలను తొగించే క్రీములు వాడుట ఉత్తమము. (బిహిష్తీ జేవర్)

## 08. తయమ్ముమ్ వివరణము

తయమ్ముమ్ అనగా శాబ్దిక అర్థం శుభ్రపరచుట. ఇస్లామీయ ధర్మశాస్త్రంలో **"నీరు లభించని సమయంలో పరిశుభ్రమైన మట్టి లేదా అటువంటి ఇతర వస్తువును ఉపయోగించి నజాసతె హుక్మీ (అశుద్ధత) నుండి పరిశుభ్రతను పొందదాన్ని తయమ్ముమ్"** అని అంటారు. తయమ్ముమ్ వల్ల కూడా వుజూ, గుస్ల్‌ల వల్ల లభించేటటువంటి పరిశుద్ధతే లభిస్తుంది. ఇది కేవలం రెండు సందర్భాలలో మాత్రమే అనుమతించ బడినది. అవి: **01.** నీరు లభించని సందర్భం, **02.** నీరు లభించినను ఉపయోగించలేని సందర్భం.

### 8.1. తయమ్ముమ్ అనుమతించబడిన సందర్భాలు

**01.** నీరు యున్న ప్రదేశం ఒక మైలు (1.6 కి.మీ) కన్నా ఎక్కువ దూరంలో యున్నప్పుడు.

**02.** శత్రువులు, దొంగలు లేక క్రూర జంతువులు నీరు లభించు ప్రదేశంలో మాటువేసి యున్నప్పుడు.

**03.** అల్లర్లు, కొట్లాటలు లేక కర్ఫ్యూ వంటి అసాధారణ పరిస్థితులలో నీటి వరకు చేరలేక పోయినప్పుడు.

**04.** త్రాగుటకు సరిపడేంత నీరు మాత్రమే యున్నప్పుడు.

**05.** బావి ఉన్నప్పటికీ నీరు తోడడానికి బకెటు, త్రాడు మొదలగు సాధనాలు లేనప్పుడు, బోరింగ్ ఉన్నను హ్యాండ్ పంప్, మోటరు, కరెంటు మొదలగునవి లేనప్పుడు.

**06.** ఏదైనా కారణం వల్ల నీళ్ళు తీసుకోవడానికి లేవలేక పోయినప్పుడు మరియు ఇతరులు నీళ్ళు అందించువారు లేనప్పుడు.

**07.** వ్యాధి తీవ్రమౌతుందనే భయమున్నప్పుడు.

**08.** వ్యాధి తీవ్రమై నయం కావడానికి ఎక్కువ సమయం పడుతుందన్న భయమున్నప్పుడు.

## గమనిక

పైవాటిలోని చివరి రెండు షరతులు, స్వీయానుభవం వలన గానీ, అనుభవజ్ఞులైన హకీం లేక డాక్టరు ధృవీకరించిననే వర్తిస్తాయి. సరియైన వైద్య సలహాలు గానీ లేక పూర్వపు రోగ అనుభవము గానీ లేకుండా, కేవలము తాను ఊహించుకొని వుజు లేక గుస్ల్‌కు బదులుగా తయమ్ముమ్ చేయుట సమంజసము కాదు.

## మసాయిల్ (సిద్ధాంతాలు)

**01.** ఎవరైనా వ్యక్తి దూర ప్రయాణమునకు బయలుదేరేటప్పుడు, నీరు లభించే ప్రదేశం బహు దూరమై, నీటికొరకు వెళ్ళిన ట్రైన్ లేక బస్సు తప్పి పోతుందనే భయముండి, పోవలసిన ప్రదేశానికి తరువాత ట్రైన్ లేక బస్సు దొరకదనే భయమున్నచో తయమ్ముమ్ చేయవచ్చును.

**02.** వుజూ చేస్తూ కూర్చుంటే, ఖజా పాటించడానికి వీలులేని జనాజా నమాజ్, పండుగ నమాజ్‌లు తప్పిపోతాయనే భయమున్నచో, తయమ్ముమ్ చేయవచ్చును. (దీనియాత్ 1యం స. 86)

## 8.2. తయమ్ముమ్‌లోని ఫర్జ్‌లు

తయమ్ముమ్‌లో 3 ఫర్జ్‌లున్నాయి. అవి:

**01.** అల్లాహ్ ప్రసన్నత కొరకు, పరిశుభ్రత పొందుట కొరకు **సంకల్పం (నియ్యత్) చెయ్యడం.**

**02.** రెండు చేతులు పరిశుభ్రమైన మట్టిపై తట్టి, వాటితో **ముఖాన్ని స్పర్శించడం.**

**03.** మరల రెండు చేతులు పరిశుభ్రమైన మట్టిపై తట్టి, వాటితో **రెండు చేతుల్ని మోచేతులతో సహా స్పర్శించడం.**

### గమనిక

**01.** ముఖం మరియు రెండు చేతులలో వెంట్రుకవాసి తప్పి పోయినా తయమ్ముమ్ నెరవేరదు.

**02.** వీటిలో ఏ ఒక్క ఫర్జ్ వదలి వేసినా, తప్పిపోయినా తయమ్ముమ్ నెరవేరదు.

## 8.3. ఏ యే వస్తువులతో తయమ్ముమ్ చేయవచ్చును?

పరిశుభ్రమైన మట్టి లేక మట్టికోవకు చెందిన వస్తువులు అనగా కాల్చిన కాలని, కరుగని వస్తువులు. ఉదా: పరిశుభ్రమైన మట్టి, ఇసుక, ఇటుక, గులక రాళ్ళు, కంకర రాళ్ళు, సున్నం, కట్టిన గోడ మొదలగు వాటితో తయమ్ముమ్ చేయ వచ్చును. (దీనియాత్ 2 యం, స. 66)

మట్టి రకానికి చెందని వస్తువులతో తయమ్ముమ్ చేయడం ధర్మసమ్మతం కాదు. ఉదా: కర్ర, చెక్క, లోహం, బంగారం, వెండి, అద్దం, సీసా మొదలగునవి. కానీ వీటిమీద దుమ్ము యుంటే, వాటిమీద తయమ్ముమ్ చేయవచ్చును.

## 8.4. తయమ్ముమ్ చేయుపద్ధతి

ముందుగా "బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీం" చదవాలి. తరువాత "అపవిత్రతను దూరము చేయుట కొరకు, మరియు నమాజ్‌ను ఆచరించుట కొరకు నేను తయమ్ముమ్ చేయుచున్నాను" అని తయమ్ముమ్ కొరకు సంకల్పం (నియ్యత్) చేసుకోవాలి. పిదప రెండు చేతుల వ్రేళ్ళను వెడల్పుగా చేసి పరిశుభ్రమైన మట్టిపై మెల్లగా తట్టాలి. తరువాత కుడి చేతిని ఎడమ చేతిపై తట్టి, లేక ఊది, దుమ్ము రాల్చేయాలి. తరువాత ముఖం మీద కొద్దిగా గూడ వదలకుండ స్పర్శించాలి. గడ్డం ఖిలాల్ కూడ చేయాలి.

మరల రెండు చేతుల వ్రేళ్ళను వెడల్పుగా చేసి పరిశుభ్రమైన మట్టిపై మెల్లగా తట్టాలి. పిదప ఎడమ చేతి నాలుగు వ్రేళ్ళ లోపలి భాగాన్ని, కుడి చేతి వ్రేళ్ళ వెలుపల చివరలో ఉంచి మోచేయి దాకా స్పర్శించాలి. మరల ఎడమ అరచేతిని కుడి మోచేతి యొక్క రెండవ వైపున వుంచి వ్రేళ్ళదాకా స్పర్శిస్తూ పోవాలి. ఇదేవిధంగా కుడిచేత్తో ఎడమ చేతిని గూడా స్పర్శించాలి. కొద్దిగా కూడ, స్పర్శించకుండ ఖాళీగా వదల కూడదు. చేతికి గడియారం గానీ వుంగరం గానీ యుంటే, వాటిని కూడా కదిపి, వాటి క్రింద కూడా స్పర్శించాలి. ఇట్లు చేసినచో తయమ్ముమ్ పూర్తి యగును.

తయమ్ముమ్ వుజూకు కొరకు చేసిననూ, గుస్ల్‌కు కొరకు చేసిననూ, చేసే విధానం ఒకటే. (దీనియాత్ 2 యం, స. 67)

## 8.5. తయమ్ముమ్‌ను భంగపరిచే విషయాలు

**01.** ఏ యే కారణాల వల్ల వుజూ భంగమౌతుందో, ఆకారణాల వల్ల తయమ్ముమ్ కూడా భంగమౌతుంది.

**02.** నీరు లభించని కారణంగా చేయబడిన తయమ్ముమ్, నీరు లభించిన వెంటనే భంగమౌతుంది.

**03.** అనివార్య కారణాల వల్ల తయమ్ముమ్ చేసియుంటే, ఆ కారణం తొలగిన వెంటనే తయమ్ముమ్ భంగమౌతుంది. ఉదా: వ్యాధి కారణంగా చేసిన తయమ్ముమ్ స్వస్థత కలుగగానే భంగమౌతుంది.

### మసాయిల్ (సిద్ధాంతాలు)

**01.** ఎవరైనా తయమ్ముమ్ చేసి నమాజ్ ఆచరిస్తూ యుండినచో, నీరు లభించిన వెంటనే లేక నీటిని ఉపయోగించే అర్హత కలిగిన వెంటనే, నమాజ్ భంగమై పోతుంది. మరల వుజూ చేసి నమాజ్‌ను ఆచరించాలి.

**02.** అనివార్య పరిస్థితులలో వుజూకు బదులు ఎట్లు తయమ్ముమ్ సరిపోతుందో, అట్లే గుస్ల్‌కు బదులుగా కూడా తయమ్ముమ్ సరిపోతుంది.

**03.** తయమ్ముమ్ కొరకు సంకల్పం (నియ్యత్) తప్పనిసరి. వుజూ మరియు గుస్ల్, రెండింటికి ఒకే విధమైన సంకల్పం సరిపోతుంది. వుజూ మరియు గుస్ల్

రెండింటి కొరకు ఒకే తయమ్ముమ్ సరిపోతుంది. వుజూ మరియు గుస్ల్ కొరకు విడివిడిగా తయమ్ముమ్ చేయనవసరం లేదు.

**04.** నీరు, తయమ్ముమ్ చేయటానికి ఉపయోగించే ఇతర వస్తువులు ఏవియు లభించని, విధిలేని పరిస్థితులలో తహారత్ లేకుండానే నమాజ్‌ను ఆచరించ వచ్చును, కానీ ఆనమాజ్‌ను అనుకూల పరిస్థితులలో వుజూ చేసి మరల ఆచరించ వలెను. (బిహిష్తీ సమర్, హిస్సా అవ్వల్, స.38)

## 09. మిస్వాక్ (పళ్ళు తోము పుల్ల)

వుజూ చేయునప్పుడు మిస్వాక్‌తో పళ్ళు తోముకొనుట సాంప్రదాయం (సున్నత్). (అత్తర్గీబ్ వ త్తర్హీబ్) హుజూర్ అక్రమ్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు ఇట్లు సెలవిచ్చిరి: మిస్వాక్ తో వుజూ చేసి ఆచరించిన నమాజ్, మిస్వాక్ లేకుండా వుజూ చేసి ఆచరించిన నమాజ్ కన్నా 70 రెట్లు శ్రేష్ఠమైనది.

మరొక హదీసులో ఇట్లు పేర్కొన బడినది: నా ఉమ్మత్ (అనుచరులు) ఇబ్బందుల పాలవుతారను ఆలోచన లేనిచో, మిస్వాక్ నువాజిబ్ (తప్పనిసరి) గా నిర్ణయించే వాడిని.

మిస్వాక్ యొక్క పొడవు (వాడే వ్యక్తి యొక్క) జానెడు కన్నా పొడవు చిటికిన వ్రేలికన్నా లావు లేకుండా యుండిన మంచిది.

### 9.1. మిస్వాక్ వలన ప్రయోజనములు

మిస్వాక్ వలన అనేక ప్రయోజనాలు కలవు. వానిలో కొన్ని ఇవి:

**01.** నోటి దుర్వాసనను దూరం చేస్తుంది.

**02.** పళ్ళు దృఢంగా, శుభ్రంగా, తెల్లగా మెరుస్తూ ఉంటాయి.

**03.** మనస్సుకు ప్రశాంతతను కల్గిస్తుంది, బుద్ధికి పదును పెట్టుతుంది, జ్ఞాపకశక్తిని అధికం చేస్తుంది.

**04.** సత్కార్యాలు ఆచరించే సద్బుద్ధిని కలిగిస్తుంది.

**05.** అల్లాహ్ ప్రసన్నతను, అనుగ్రహాన్ని కలిగిస్తుంది.

**06.** మరణ సమయంలో కలిమయె షహాదత్ ప్రాప్తమౌతుంది.

**07.** నమాజ్ యొక్క పుణ్యం 70 రెట్లు అధికమౌతుంది. (అల్‌బహ్రుర్‌రాయిఖ్)

## 10. యుక్త వయస్సుకు సంబంధించిన ఆదేశములు

బాలురు 15 సంవత్సరముల వయస్సు పూర్తి చేసినచో యుక్త వయస్సుకు చేరినట్లుగా పరిగణింప బడుదురు. అప్పటి నుండి నమాజ్, ఉపవాసము మొదలగు షరీఅత్ విధించిన సమస్త నియమములు పాటించ వలసి యుండును.

బాలికలు **1.** ఋతుస్రావము కలిగినప్పటి నుండి యుక్త వయస్సుకు చేరినట్లు పరిగణింప బడుదురు. **2.** ఋతుస్రావము కలుగక పోయినను, గర్భము దాల్చినచో, యుక్త వయస్సుకు చేరినట్లు పరిగణింప బడును. **3.** గర్భము దాల్చక పోయినను, పురుషునితో సంభోగించి నట్లు కల గనిన నప్పుడు ఆనందము కలిగి, మనీ (యోని నుండి స్రవించు ద్రవము) బయటకు వచ్చినను యుక్త వయస్సుకు చేరినట్లుగా పరిగణింప బడును. పై మూడు కారణాలలో ఏ ఒక్కటి కూడా లేక పోయినను, 15 సంవత్సరాల వయస్సు నిండినచో యుక్త వయస్సుకు చేరినట్లుగా పరిగణింప బడును.

### మసాయిల్

01. యుక్త వయస్సుకు చేరినప్పటి నుండి నమాజ్, ఉపవాసము మొదలగు షరీఅత్ విధించిన సమస్త నియమములు పాటించ వలసి యుండును.

02. ఏ బాలికైననూ 9 సంవత్సరాల లోపు యుక్త వయస్సుకు చేరుట జరుగదు. ఒకవేళ రక్తము వచ్చినను, అది బహిష్టు రక్తస్రావము కాదు. అది ఇస్తిహాజాగా పరిగణింప బడును.

**********

విశ్వాసి వుజూ చేయుట కొరకు అవయవములను కడిగినప్పుడు, వాటి వలన కలిగిన సమస్త పాపములు కడిగివేయబడును. (నసాయి) వుజూ తరువాత హృదయము నుండి ప్రపంచపు ఆలోచనలను విడిచి ఏకోన్ముఖుడై అల్లాహ్‌ను స్తుతించుచు నమాజ్‌ను పూర్తి చేసిన వ్యక్తి అప్పుడే తన తల్లి కడుపు నుండి పుట్టిన వానివలె పరిశుద్ధుడగును. (ముస్లిమ్) అనగా వుజూ వలన శరీరపు సమస్త పాపములు క్షమించ బడును. మరియు నమాజ్ ఆచరించుట వలన సమస్త రహస్య పాపములు క్షమించ బడును. (కష్ఫుల్ ముగ్‌తా)